# పతిత

(పద్యకావ్యం)

రచయిత

నంబూరి సుబ్బరాజు

ప్రాప్తిస్థానం:-
గ్రంథశ్రీ
18, మహాభూపాల్ మంజిల్
జాంబాగ్, హైదరాబాద్.

రూపాయి

ప్రథమ ప్రచురణ.　　1000 ప్రతులు

August 1955

(ప్రచురణ హక్కులు రచయితవే)

"తెలుగుదేశం ప్రెస్"
హిమాయత్ నగర్
హైదరాబాదు.

# తిలక రేఖ

స్కూలు ఫైనల్ అయితే ఒక వేయి, ఇంటరయితే రెండువేలు బి. యే. అయితే మూడువేలు. పిత్రార్జితం ఒక డాబాకొంపగాని, పదిఎకరాల పొలం గాని ఉంటే అయిదువేలు. ఎంత ధనికుడు అయితే అంతగ సున్నాల పెంపకం.

బిడ్డల గన్న తండ్రులు తలతాకట్టుపెట్టి, పొలమూ బొట్లూ అమ్ముకొని పైసాలు తెచ్చి, పైపోటీలు పెట్టుకొని మార్కెట్టులో అల్లుండ్లను కొనుక్కోవాలి, ఈ వేలం వెఱ్ఱిలో దరిద్రుల బిడ్డల గతి దైవానికే ఎఱుక.

పెద్ద చదువులు చదువువారు విజ్ఞానం, సంస్కృతి, ప్రగతి, అభ్యుదయం అంటూ ఏమేమో మాట్లాడుతారు. ఈ యువకులు ఈ భావి భారత పౌరులు సంతలో ఈ వేలం పాటకు ఎట్లా తలవొగ్గుతారో!

మగవాడి కేమి: మహారాజు— పల్లకాటి నుంచి కొంపకు రాగానే వధువు సిద్ధం. కాకపోతే నిత్యాగ్నిహోత్రాలకు భంగం కదూ! వైదిక ధర్మోద్ధారకులు!

అమ్మాయి అత్తయింట్లో అడుగు పెట్టీ పెట్టకముందే " వారు " పరంపదిస్తే ఆ నిర్భాగ్యురాలికి బ్రతికినంతకాలం అరవచాకిరితో సరి. ఆ బ్రతుకు అనుభవించేదానికే తెలుసు—కంటితడిఆరని కన్నతండ్రులకేతెలుసు—

భర్త నవనాగరికుడు— భార్య పట్టి "తెలుగు" మనిషి— అబ్బాయికి పెండ్లిపీటల మీద నోట్లకట్టలు గిట్టివుండినా సరే — ఆ " తెలుగు " పిల్ల పొసైటీకి పనికిరాదు.

మొగుడు అష్టమైన గడ్డిమేసి నాలుగు రోజులు పెద్దమనిషిగా మెలిగితే, "అప్పుడేదో అట్లా వున్నాడు గాని ఇప్పుడు ఎంత బుద్ధిమంతుడు" అంటారు నలుగురూ. ఏ మాయలోనో పడి పిల్ల కాలుజారితే ఇక వారి బ్రతుకు కుక్క బ్రతుకే —

అబ్బ ! మన నంసారాలలో ఎంత కశ్మలం ! "కలకంఠి కంట కన్నీ రొలికిన సిరియింట నుండ నొల్లదు సుమతీ" అనే నీతివాక్యం శతకంలోనే నిలిచివుండాలా !

అందరి రోగాలకూ ఒకటే ఔషధం— "హిందూకోడు బిల్లు" ఉన్నది ఉన్నట్టుగా ప్యాసుకావాలి. ఆ శుభకాలం ఎన్నటికో !

ఒక దరిద్రుడి బిడ్డ— తండ్రిబాధను చూడలేక ఒక ముసలిమొద్దును కట్టుకుంటుంది. ఆయన అవతలికి దాటగానే విధవ అయిపడిన నానాపాట్లను ఈ కావ్యం చిత్రిస్తున్నది. ఈ కవికి తాను గ్రహించిన వస్తువుపై రక్తి పూర్ణంగా వున్నది. ఆవేదన, ఆవేశం కూడా ఈ కవికి పుష్కలంగా వున్నాయి. ఈ ఒక లక్షణం ఉన్న తరువాత ముమ్ముందు ఇంకా ఉత్తమ కావ్యరచనను కొనసాగించగలడని నా పూర్తి విశ్వాసం—

"నీవు ఈ తప్పు చేయవద్దు" అని శాసించడం కంటే; "ఈ తప్పు మానుకుంటే నీకు ఈ లాభం కలుగుతుంది" అని హితోపదేశం చేసే దానికంటే : ఆ తప్పుచేసి కష్ట నష్టాలు పొందిన జీవి అనుభవాలను శిల్పమనోజ్ఞంగా చిత్రించగలిగితే- ఆ కావ్యం మనకు కనువిప్పై నంస్కార హేతుకమవుతుంది— అందుకే "కావ్యం కాంతా సమ్మితం" అంటారు ఆలంకారికులు.

ఈ కవి ఇంకా ఉత్తమ కావ్యాలు రచించాలని మనఃపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

| | |
|---|---|
| కృష్ణా పత్రిక<br>బందరు. | బెల్లంకొండ రాఘవరావు |

# స మ ర్ప ణ



స ఖు లు,

సహృదయులు,

సాహిత్య ప్రియులు.

శ్రీ బుఱ్ఱా వెంకట సుబ్బారాయుఁడు గారికి

(యమ్. ఏ., యల్. యల్. బి.)

సుప్రీంకోర్టు అడ్వొకేటు.

# కృతజ్ఞతలు



ద్రవ్యసహాయంసల్పిన మిత్రులు-

శ్రీ రాజా రాఘవరాజు, యర్రంరాజావారికి

(నూగూరు-వెంకటాపురం ఎస్టేటు జమీందారు-తూ.గో.)



తిలకరేఖ నొసంగిన సహృదయులు

శ్రీ బెల్లంకొండ రాఘవరావుగారికి



నన్ను ప్రోత్సహించిన మిత్రులు విఖ్యాత కథకులు

శ్రీ ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి గారికి



శ్రీ పి. పుల్లారెడ్డి, యం. యల్. ఏ.

డా|| సువర్ణ సుబ్రహ్మణ్య శర్మగార్లకు

# సందేశం

గోవిందనామాల కులికెడి యువతికి
సంధి సమాసాల చర్చయేల ?
చాకలిపద్దులు సరిచూచు చానకు
గణిత శాస్త్రాభ్యాస గంధమేల ?
వంటింట వరలెడి వనజాయతాక్షికి
హిష్టరీ చదువుల రొష్టులేల ?
బిడ్డల కనిపెంచు బిబ్బోకవతులకు
"బోటనీ, బీకాము" బోధలేల ?
పూలమొక్కల బెంచు బాలికామణులకు
ప్రకృతి శాస్త్రంబుల పటిమయేల ?

ప్లాటుఫారము ప్రెస్సులు పడతికేల ?
రస సమితిని పచనచేయు రంగులాడి
కమిత ఘోర భీకర మారణాస్త్రమేల ?
అనుచు వాపోవనేల దేశాప్తులార !

ఇహ పర సాధన సహన భావాలకు
సాహిత్యగోష్ఠులు సతికి వలదె ?
జీవనాధారమౌ శ్రేష్ఠార్థశాస్త్రంబు
సాధింప యత్నంబు సల్పవలదె ?

విశ్వోత్తి హానములన్ విని వశంబొనరించి
శీలంబు సతులెపు డేలవలదె ?
ప్రకృతి సౌందర్యంబు పరికించి భూగోళ
శాస్త్రాన గృహముల సర్దవలదె ?

శకట భారంబు యెడ్లకు సమముగాదె ?
రససమితిని పచనచేయు లాఘవమున
ఘోర భీకర రణభూమి మారవలదె ?
స్వార్థమే జన్మ పరమార్థ సాధనంబ ?
సముచిత విధానసంఘమున్ సాకుడయ్య

మృదు మధుర కవితా మాధురీ గరిమచే
అలరు సరోజని అతివగాదె ?
శానఫాన్ సినుసభ న్మట్ను నోడించిన
పండిత శ్రీమతి పడతిగాదె ?
అసమాన సాహస వ్యవహ_ర్త్రిగా నున్న
అరుణదేవియు పూజ్య తరుణిగాదె ?
ఆజాదుఫౌజులో 'ననుపమ రణనీతి
పాటించు లక్ష్మియు భామగాదె ?

మంత్రి "రాజకుమారి కౌర్ !" మగువకాదె
కమల, లీలావతీ మున్ని, కస్తురమ్మ
మున్నగు ప్రసిద్ధ లుండిరి ముదితలందు
పురుషులకు జంకరెప్పుడు తరుణులెందు

పతిభక్తి బోధింప పాటుపడుదువెంతొ
ఏకపత్నీవ్రత మెంచవెపుడు
పాశ్చాత్య పద్ధతుల్ పాటింతు వీవెప్డు
ఉవిదచెప్పులు దాల్ప నోర్వలేవు
పొరుగుకాంత స్వేచ్ఛ పోషించు నీవేల
భార్యను పెట్టెలో వైచి దాతు ?
సర్వజీవుల యిచ్ఛ సాధించు నీవేల
ఆత్మస్వతంత్రంబు నార్పజూతు ?

షష్ఠి పూర్తియైనను కాంత నరసలేమి
నిశల నిద్రింపలేని మనీషివర్య
పడుచు విధవల పెండికి పంతగించి
కొంప పీకి పందిరివేయు కోర్కె యేల ?

ఆర్థిక సామ్యమే ఆశింతు వెప్పుడు
స్త్రీల హక్కులబిల్లు మూలత్రోతు
సాంఘికోన్నతి వేగ సాధింప పలుకుదు
సాని మేళంబుల మానలేవు
స్త్రీవిద్యయో యని చింతింతు వనిశంబు
కన్నకూతురు మాట కాంచలేవు
లింగభేదంబును గంగలో కలుపుదు
వర్ధాంగి పరదాల నణచివైచి

ఏటి మర్యాదలివి కీర్తిపేటులార !
కాల పరివర్తనంబును గాంచుడయ్యా
వృష్టివాహిని నాపంగ కష్టమయ్యా
కపటమున్ వీడి సంఘమున్ గావరయ్యా

తల్లియై చల్లగ యెల్లకాలము నీకు
నుపచారముల్ సల్పు నువిదకాదె ?
భగినియై రక్తంబు భాగించుకొనివచ్చి
వర్తించు ధీమతి వనితకాదె ?
భార్యయై ప్రకృతియై పరవళ్లుత్రొక్కించి
ఆనందమున దేల్చు నతివగాదె ?
ఆత్మజయై సదా అమల మోదంబిచ్చి
ముచ్చటల్ దీర్చెడి ముదితగాదె ?

కోడలై, మన్మరాలయి కోర్కెదీర్చు
భాగ్య భోగాలరాసియు, భామగాదె ?
నీ మనుగడకే హేతువు నీరజాక్షి
గాదె ? హెచ్చు లొచ్చులు వీడి, కనుము నిజము

తండ్రి యెట్లు తమకు దైవసమానుడో
తల్లియంత యటంచు తలపవేల ?
సోదరు డెవ్విధి స్తుత్యుండు పూజ్యుడో
సోదరి యట్లని చూడవేల ?
భర్త యెంతటి మాన్య వరుడంచు నెంచెదో
భార్య యట్లే యని పల్కవేల ?
కొడుకును కనినంత కులికెద వెంతయో
కూతురనిన యంత కుమిలెదేల ?

అల్లుడన యెంత బెదరెదో హడలుచుండ
కోడలన నంతగా మది చూడవేల ?
మనుమ డన్నంత ప్రేమతో మనలు నీవు
మనుమరాలన్న వద్దు పొమ్మందువేల ?

చతుషష్టి కళలలో నతులమై యొప్పెడి
భరతనాట్యంబన్న బాధయేల ?
రాల్ కరగించెడి రమ్యసంగీతంబు
నేర్పింప సాకులు కూర్పనేల ?
చలన చిత్రంబుల వెలుగువారల గాంచి
పతితులన్ భావాల భ్రామయనేల ?
సాహిత్య మకుటమై జను నాటకంబుల
వెలది వీక్షింపంగ భీతియేల ?

చాన చతుష్షష్టి కళలందు చతురగాదె ?
స్త్రీలు సౌందర్యమూర్తులై ప్రేమగొనరె
పడుచులన్ బాధపెట్టుటే పరమధర్మ
సూత్రమా ! మీ పురాణాల సూక్తులందు

శాస్త్ర ప్రమాణాల్ సాధింతునందువా
శాస్త్రముల్ సమదృష్టి చాటుచుండు
ప్రకృతియే భేదముల్ పాటించునందువా
మానవ సృష్టిలో మార్పులేదు
హేతువాదంబుల జేతునేనందువా
విషయవాంఛల లేదు భేదమెపుడు
పరిణామ వాదంబు పాటింతునందువా
వస్తు తత్త్వంబులు బయటపడును

అన్ని వాదములన్ వీడి అతిముదమున
ఒక్కపిడి వాదమే నీకు మక్కువైన
లేదు శక్తి నీతోడను వాదులాడ
పాశవిక ప్రవృత్తి ప్రమాద మనుటకన్న

భోగ భాగ్యము లిచ్చి భోగింపజేసెడి
వరలక్ష్మిదేవి మా వనితగాదె ?
సంగీత సాహిత్య సత్కళలం దొప్పు
విద్యాధిదేవత వెలదిగాదె ?
అరిమర్దనోద్దీప అతిభయంకర రూప
భద్రకాళియు గూడ ప్రమదగాదె ?
తులలేని సిరులతో దులతూగుదేవి "పు
లోమజ" మా పూజ్య భామగాదె ?
చెప్పబూనిన కొదవేమి గొప్పలకును
ఒప్పదో ఒప్పవో యేల చప్పరింతు ?
ఒప్పినను నొప్పకున్నను తప్పిపుచ్చు
కాలమంతయు చల్లగా గడచిపోయె

చర్చలో మండన శంకరస్వాముల
తులదూచు శారద లలనగాదె ?
గణితశాస్త్రంబులో గణ్యురాలై నట్టి
"లీలావతీదేవి" లేమగాదె ?
భక్తి పరవశాన ప్రముఖురాలై చన్న
రాణి మీరాబాయి రమణిగాదె ?
దేశంబు సేవింప దేహంబు విడనాడు
ఝాన్సి మహారాణి జాణగాదె ?
వాద భేదముల వదలి వరలజేయు
ముదిత నేరంగరానట్టి ముచ్చటేమి
కలదు ? ఒక కంట బెల్లంబు కంట మరొక
దాని మన్నంబు పెట్టుట తగునటయ్య

పెండిలియన్ సుడిగుండములో నున్న
మర్మముల్ తెలుపవు మాయదొలగ ?
స్వచ్ఛంద వృత్తిగా సాగు 'స్వయంవర
ములు' కలవని మాకు తెలుపవేమి ?
రోగి, విదేశాల సాగెడు భర్తను
వీడవచ్చునటంచు వాడవేమి ?
విధురుని రీతినే విధవయు పెండ్లాడ
కలదంచు ధైర్యాన పలుకవేమి ?
నిన్ను విడనాడ నేనంచు నీవు నేను
శుభసమయమున జేసిన అభయ శపథ
మగ్ని వేల్చిన నీవు నా కంటగట్టి
దాని వీడింప జూచెదు ధర్మమిదయ ?

మగవాడు చచ్చిన మానినీమణికిటు
నిర్బంధ వైధవ్య నియతియేల ?
నిర్బంధ వైధవ్య నియమంబుతో పాటు
భోజన విషయమై బోధయేల ?
భోజన నియమాల బోధలతో పాటు
కేశఖండన ఘోర కృత్యమేల ?
కేశఖండనమున కృశియించు విధవకు
శౌచంబు మాన్పించు శాత్యమేల ?
తలయు తోకయు లేనట్టి తర్కమేల ?
ముక్కు మొగములు లేనట్టి చిక్కులేల ?
సహజభావంబు నావుట సహజమయ్యా
ఏమి ప్రారబ్ధమో యిది యెంచరయ్యా

పూబోడి యీల్గిన పురుష పుంగవునకు
వేషాలు మార్పింప వెడలవేల?
వేషాలు మాన్పింప వెడలనేరవుగాని
నీతి నియమములు నేర్పవేల ?
నీతి నియమముల నేర్పంగలేవుపో
కుటిలవర్తన మాప గోరవేల ?
కుటిలవర్తనమాపు కోర్కెలు లేవుపో
పురుషుల హక్కుని పొంగనేల ?

ఇంతకన్న నైచ్యంబును నింతకన్న
నాస్తికత్వంబు నింకింత నరకబాధ
లేదు పురుషుల పతనంబు లేశమైన
గాంచలేనట్టి మీరెపో ఘనులు జగతి

ఇష్టము వచ్చిన పట్టుపుట్టము గట్టి
ముచ్చటల్ దీరని ముగ్ధలుండ
పెరవారి వైనను ఎరవుగా తెచ్చిన
వస్తువుల్ దాల్చని వనితలుండ
మొదటి నోమయినను తుదకేని నోచని
దురదృష్టవతులైన తరుణులుండ
పెండ్లి పేరంటముల్ పేరిట గైచేసి
ఊరేగి యెరుగని ఉవిదలుండ

హృదయమంతయు నావిరై యిగిరిపోదె
బాల విధవల దుర్దశన్ ప్రతిదినంబు
చూచు నీకేల లేదు విశుద్ధ కరుణ
మార్చివేయుము మూఢాచారాల మార్గమింక

బాలెంత చావులు ప్రబలి పీడించిన
గృహ వైద్యమైనను నేర్పవేమి ?
ఆత్మరక్షణ లేమి అన్యాయమలమగా
కత్తిసాములు మాకు గరుపవేమి ?
దేహ పటుత్వముల్ దిగజారుచుండంగ
కసరతుల్ బుద్ధిమై గరుపవేమి ?
మానంబు రక్షింప మమకారమును నేర్పి
వలసిన శస్త్రుల నిలుపవేమి ?

మాకె ఆరోగ్య మాయువు మాకె సిరులు
అనుచు వలపించు నీవు మా హక్కులైన
ఒసగజాలవు కాలంపు పసనుజూడు
ఏటి కెదురీదు బింకంబు లేటికోయి ?
నవ రసోచిత భావాల సాకుమోయి

కొమరునితో పాటు కొమరితకున్ గూడ
పుట్టింట ఆస్తిపాల్ పెట్టువరకు
వైకుంఠ మరయగ వంటయిల్లే, గది
కైలాసమను బుద్ధి గడచు వరకు
లోకానుభవములు లోకేశు చింతయు
ముద్దుగా ముదితలు పొందు వరకు
బిడ్డల గని పెంచు బొడ్డయంత్రము గాదు
జనని మాతను చింత తనరువరకు

స్త్రీని అనుమానమున నిందచేయు నీకు
శాంతి లవమైన లేదు మీ సంఘమందు
"యత్ర నార్యేస్తు పూజ్యంతే తత్రదేవ
తా రమంతే "యనెడి సూక్తి తలపరయ్యా

# పరిచయం—పరిణయం

ఏడ్చుచు దుఃఖాతిరేకయై అతివయోర్తు
తల్లి గోదారి గర్భాన తనువు వాచి
శాశ్వతానంద సంయోగ శాంతిగోరి
ఒడ్డుసన్ జేరి యత్నాన ఓర్చుచుండె

అత్తరి నచ్చోట రిత్తగా నేలపై
అర్ధ నిద్రావస్థ నార్తనాద
మంతయు చెవులార నాలకించిన పెద
రైతొకండు మిగుల భీతిజెంది
త్రుళ్లిపడుచు లేచి కళ్లు నులిమికొనుచు
చిత్తరబిత్తరై చిత్త శూన్య
మందియు చీకటి నాడుగొంతును మది
చక్కగా గుర్తించి ఒక్కమాట

అంగనామణీ! యేటికి ఆత్మహత్య?
తాళుమింక యీ యత్నంబు దగదు నీకు
కష్టముల్ కలకాలము కఠినమతిని
తిష్ఠవేయవు శిరముపై నిష్ఠతోడ

రమణి! ఎవ్వరిదానవు? విమలచరిత
మయిన జీవితంబున యేల ఆశవదలి
యత్నమున్ జేయుచుంటివో హత్య కిటుల
తెల్పు మింకైన దాచక తెప్పరిల్లి

అనుచు నార్తైతు బిడ్డడా యతివజేరి
బల్మి వారించి ఓదార్చిపట్టి తనదు
కళ్లమున జేర్చి కూతుగా గారవించి
ఆదరోక్తుల తోడ తా నాదుకొనియె

( ఆమె )

ఏల మాన్యచరిత హీనురాలనైన
నాపయిని యిట్టి కారుణ్య కారణంబు ?
వలదు పోనిమ్ము గోదారి వలపు తల్లి
నిండు గర్భాన నా తను వుండనిమ్ము

పతితను, చరిత్రహీనను పాపకార్య
లంపటత్వాన పడి శీలరాశి గూల
ద్రోసి, దేహ సౌఖ్యంబును దోచుకున్న
నీచురాలను విడుమింక నీకు మేలు

( అతడు )

పతితను, పతితనంచును బాధయేల ?
పతిత, సతియను భావాలె ప్రబలియుండె
అంతియే గాని వివరాలు నుంతలేవు
తారతమ్య మీమాంసకు తగను నేను

పరిసర పరిస్థితుల బట్టి జరిగిపోవు
నంతియే గాని యేరికి నుంతయైన
యోచన యనునది మది తా తోచకున్నె
వ్యర్థ యత్నంబులేటికో యమ్మ నీకు

కాన మది వేడుక జనించె గాథతెల్పు
మంత్రియే గాని గోదారి ఆశమాను
చప్పి సాధించునది యేమి సంఘమందు
ప్రతికి సంస్కరించుట మన బాధ్యతనద !

( ఆమె )

పుణ్యమా ! పురుషార్థమా ! పూజనీయ ?
శీలహీన గాథాసక్తి యేలనయ్య ?
ఉత్తమ పురాణగాథల నోర్మితోడ
ఆలకించిన గలుగు బుణ్యంబు నీకు

ఓ మహాశయా ! యింక నీ ఓర్మిమాట
మాత్రమే గాదు మనమందు మఱుగియుంచె
మానసీయమౌ యుత్కంఠ మరులుగట్ట
ఎట్లు కప్పిపుచ్చితివయ్యా యిట్లునీ ? పు

గోదావరీ పావనోదారవాఃపూర
మఖిలవేళల పారి సుఖమయముగ
శ్యామల కోమల సస్య సమృద్ధితో
పచ్చి బంగారంబు పండుతల్లి
నారికేళ కదళి నారింజ మామిడి
పేర్మిని తోటలన్ బెంచుతల్లి
మల్లె, జాజి, గులాబి మొల్లలు విరజాజి
ఉద్యాన వనశాల నూగుతల్లి
కంద, పెండలం, బీర, కాకర, సొర, వంగ
పాలు పెరుగుల నొప్పారుతల్లి

అడుగడుగున సరస్వతి ఆలయాలు
పల్లె పల్లెకు సంచరపథము లలరి
ధనకనక వస్తువాహన ఘనతతోడ
ప్రకృతి రమణీయ కమనీయ ప్రతిభకల్గు
తల్లి గోదారి నొకట మా పల్లెటూరు

అచట కులశీల మర్యాద లతుకులేక
నియమ, నిష్ఠాగరిష్ఠులై నీతిగల్గి
మాధ్యమికపు టార్థికనుష్టి మిధ్యగాక
బ్రతుకు నొక కుటుంబాన సంభవముగంటి

చెప్పించె జనకుండు కుప్పకుప్పలవోలె
ఆంధ్ర గీర్వాణంబు లాశతోడ
సంగీత సాహిత్య సమసమానంబని
నేర్పించె 'సరిగమ' నేర్పుతోడ
రూపంబు విద్యయు, కాపురం బీమెలో
నుండెనటంచు మా యూరివారు
నా గుణాలెంతయో నాణ్యపర్చుచు నాదు
తలిదండ్రు లత్యంత ధన్యులనుచు

నేను నిలిచనచోటనే నియతితోడ
శ్రీ గిరిజ వాణి నిలుకడ చెందుననుచు
పొగడుచుండంగ వచ్చెను పొర్లుకొనుచు
పెండ్లియాడు భూతమువోలె కండ్లముందు

నన్ను చూచి మురిసిపోవు నాదు తండ్రి
వరునికై తిర్గినారాంధ్ర వసుధనంత
ఏడబోయిన 'కట్నాల' పీడతోడ
కుదురుతప్పి నాయనగారు కుమిలిపోయె

బిడ్డరూపు గుణపు మోజు బిడ్డగన్న
వారికే గాని లోకపు వారికేల ?
పట్టభద్రులు 'కట్నాల' పాటఁ గాని
సంఘ సంస్కార సహనంబు సల్పలేరు

సంతలోని పశువువోలె చదువుకున్న
మనుజజాతి వింతపశువుస్ మాన్యవర్య
వేలలో నూర్లలోకొని వేగలేక
తిరిగి వేసారి యింటికి దరలినారు

నవ నవోన్మేష నాగ సుస్థిరినటంచు
సకల శుభలక్షణోపేత సాధ్వియనుచు
కన్య గంధర్వ కిన్నర కంఠినసుచు
భావికై తండ్రి యెంతయో బాధగొనెను

'రాణి' గావలసినయట్టి రమణి యీమె
సాంఘిక దురితంబులు బహు సాగుచున్న
దారిపోవు మనుజు కెట్లు 'ధారవిడుతు'
ననుచు శంకించుచుండె తా ననుదినంబు

జరుగుచుండెను కాలంబు జాగులేక
చిక్కు లంతకంతకు పెరి యెక్కువగుచు
అంధకారము వ్యాపించె నాత్మయందు
వయసు కష్టాలు త్రుళ్లుచె వదలుచుండె

అట్టితరి నొక్క సంధ్యలో ననుకొనకయె
నాన్నగారమ్మయును లోని నవపయంపు
ఏమియో గుసగుసలాడి యెసపు తృప్తి
జెంది, వినిపించిరంతయు చెలువు మీర

నలుబది వసంతకాలాల నడిమివాడు
కాయ పాటవంబేమియు కదలలేదు
నను నెరపుగాని పూర్వపు నెరపుగాదు
నెచిపుట్టిన నితత్రి నేమువంట

మూల్గుచుండెను నట్టింట ముత్తయిదుగ
శ్రీ మహాలక్ష్మి సిరేఖ చిగురుదొడగ
అతని యతిస యుభాగ్యత నస్తమించె
సవ్యరాశి తప్పింపంగ సాధ్యపడునె?

నివురు గప్పిన నిప్పునన్ నీ ముఖాన
మరలుగొన్నట్టి యోగంబు మాన్యమగుచు
వెలుగుబాటల పయనించు వేళవచ్చె
నింక తల్లి! శుభశ్రీలు నినుమడించు

కల్పితానంద మూహుర్తె కన్యఁ తల్లి
దండ్రుఁ లిద్ద రిబ్బంగి నా డంపచేరి
చేయు మన్ననలకు కంట్లు చెమ్మగిల్లి
పూర్వజన్మ కర్మంబని పుణికరించె

తండ్రిగారి యుపన్యాస దర్పమునకు
తిరిగి చెప్పుట కేమియు దిగులులేదు
కాని, ఆర్థిక దుస్థితి కలతబెట్ట
మంచిదనుచు గైకొంటినే మౌనముద్ర

కరిగ, పొట్టిగ, చిరుబొజ్జ కలతజుట్టు
కోలమోము యెత్తుగలట్టి పల్వరసలు
అమ్మవారి మచ్చలగుంట్లు కొమ్ముముక్కు
"సూక్ష్మ పొట్టాసుర లక్షణ సుందరుండు"

పాణిగ్రహణ ముహూర్తాన ప్రక్కనుండ
గాంచి ఒడలు కంపించె నా కన్నులేడ్చె
కన్య చెరతొలగంగ నాకన్నవారు
గడిపినారు "కాళ్ళు కడిగి; కన్యాదాన"

సారె చీని చీనాంబర సంభృతముగ
అత్తవారింటి పయనమాయత్త పరచి
అశ్రుధారలు కొంగున నద్దుకొనుచు
కన్నయమ్మ వీడ్కొలిచ్చె కరుణతోడ

క్రొత్త కోడలి రాకకై యత్తగారు
వీధిగుమ్మాన కాచి తా విమలబుద్ధి
దృష్టి దోషంబు బాయుంగ నిష్టమతిని
దిగదుడిచి దీవనల నిచ్చి దింపినారు

# అత్తింటి

---

రంగారు బంగారు శృంగారభానుండు
పశ్చిమాంబుధిలోన చొచ్చువేళ
ఏటి లంకలమేసి పొటరిగిత్తలు
ఛెంగున గెంతెడు హంగువేళ
కాకమ్మ పల్కుతో కాంతుని రాకకై
గుమ్మాల యువతులు గూడువేళ
పగలెల్ల కష్టించి వగలమూటలతోడ
కర్షకుల్ గూటికి కదలువేళ

చందనపు బొమ్మలన్ బోలు నిందుముఖులు
మందహాసాల మజ్జన మందజేసి
మేలు పట్టుజల్తారు దుకూలరత్న
హార మొసగి కైచేత నీ హారమెత్తి
రాగ రాగిణిగా జేసె రమ్యబుద్ధి

నిండు ముస్తాబు లద్దాన పండగయ్యె
పొరలిపోయెడి యరుసంపు పొంగులలము
అమ్మ! శ్రీలక్ష్మి నిట్లు ప్రత్యక్షమయ్యె
ననుచు మురిసి దీవించె మా యత్తగారు

ఇంద్ర సౌధముబోలు నా చంద్రభవన
మందు రమణీయ శయనాల యమ్మలోన
తళతళ మెరయు విద్యుత్తు తళుకులరయు
జిలుగు పర్యంకపార్శ్వంబు జేరి మూడు
సారులు ప్రదక్షిణించి హస్తములు మోడ్చి
కాంతు పదధూళి గన్నుల కద్దుకొంటి

పార్శ్వభాగ మందున్న నన్ పట్టి కౌగ
లించు సాదరాభి మత ధురీణుడగుచు
ముద్దు గిల్గింతలే పెద్ద ప్రొద్దుసల్పి
స్త్రీని గూడు శక్తులులేక సిగ్గుతోడ
చింతజెందియు పతిదేవు డంతలోన

చెడయె నారోగ్య మిప్పుడు చింతనొంద
వలదు సేవించుచున్నాడ బలము నిచ్చు
మందు, శుద్ధిచెందు రుధిర మందరంబ
టంచు పల్కె, నా జీవంబు లదరిపోయె

ఉబికె వారాన నున్నట్టి ఉబ్బసంబు
పెరిగె గంటలలో నెంతొ పెళ్లుమనుచు
వైద్యదేవుల ముడుపులు వేద్యమయ్యె
కాల మానన్నమయ్యె నా కాంక్షలకును

మృత్యు గహ్వరంబున నున్న మేడకుండు
దీన దృక్కు లుట్టిపడ నా దిక్కుచూచి
కోసినాడను నీ పీక కోమలాంగి
" క్షమ " యనుచు కనుమూసె తా క్షణములోన

ఏడ్పు రొదలు వెల్వెడె నా యింటిలోన
భర్త పాదాల బడి నే నపారదుఃఖ
వేదనా భార భావాన ఖేదపడగ
అత్తచూపున కప్పుడే అసుర తి

వసన వస్తుసంపద నెల్ల వలచి వలచి
చేతి శృంగార గాజుల చితుకగొట్టి
తిలక రేఖాళిశోభల తీరుబాపి
శ్వేతవస్త్రాన నన్ మోడుచేసినారు.

గతుకు వైధవ్య మెంతయో నూత్నమందు
సహనమును మించ గతిలేక చచ్చినట్లు
ముసుగులో బడి ముప్పొద్దు మురుగుచుండి
ఒదిగి ఒదిగి నమస్కార మొలకబోయు
వంట లక్కకు హీనమై బతుకవలసె

---

# వైధవ్యము

అపురూప సౌందర్య మపరంజికాంతులు
సుకుమార దేహాన చుట్టుముట్ట
క్రొన్నెత్తు రెదజిమ్ము క్రొక్కారు యౌవనో
ద్రేకంబు ముప్పేట మైకమెత్త
సింధూర భూషణ శృంగారవాంఛలు
వెల్లువలై మది నుల్లుగొట్ట
వయసు వయస్సుతో నొయ్యార మొలికించు
ప్రకృతివాంఛలె పల్లవింప

పెరుగు నా జవ్వనపుగుండె బెరడువోవ
నాశలన్నియు భస్మమై పాశబద్ధ
ఘోర వైధవ్యభూతంబు గొంతుబట్ట
ననుచితాచార మింట తా నలముకొనియె

వస్త్రభూషణముల్ గొనె నత్తగారు
మరది పడకగదిని జేరె మాటలేక
చూపినారొక కొటు నా సుఖముకొరకు
దురశ కిదియె మొదటగా దుర్గపూజ

భర్తకై విలపించు నా ప్రక్క జేరి
ఏల రాక్షసీ యిట్లేడ్తు వింటియందు
కాలు మోపంగ తింటివి కన్నవాని
ననుచు రోదించి తిట్టెనా అత్తగారు

అత్త మాటలు విన్న నా అంగమెల్ల
నిప్పువోలె భగ్గున మండి నింగి కెగసి
ఏడ్వ కింకేమిచేతు నం చేర్పడంగ
పల్కుమంచు నే రోషాన పల్కినాను

నిష్ఠ దారిద్ర్య విధవవు చేష్ఠజూతు
ఎదురు చెప్పెడి సాహస మేడవచ్చె
నూడబెరికింతు నాలుక పీడబోవ
అనగ; మా క్రొత్తకోడలు అత్తగాను
'దేవి' యని తోటికోడలు దెప్పిపొడిచె

పల్కునకు పల్కు పట్టించి పత్నిపల్కు
మరది కోపానబోయి తా మాత నడిగె
గొంగడిన్దిని వెంట్రుకల్ గొడవయేల ?
కొలదివారల కనువైన గుణములింతె
ఎరుగవే యంచు పల్కె నా వీరమాత

అర్థహీన నా పోషణ వ్యర్థమనుచు
నిత్య శాపనార్థంబుల నిష్ఠతోడ
వంటలక్క నను మాన్పించి కొంటెబుద్ధి
పాకశాలకు వేంచేయ పల్కినారు

ప్రాణపతితోడ సుఖియించు భాగ్యవతిని
తోటికోడ లలంకార తొడుగులంద
చందమున్ నరసోక్తుల పొందుజూచి
అంతరజ్వాల లాకాశమధిగమించె

దేవకాంతల మరపించు దేహమేల ?
వాణి రూపించు విద్యల పాణియేల ?
కుక్క జీవితమున్ బోలు కుపితమేల ?
సృష్టిగోప్యాన దాగిన చోద్యమేమొ

పారదము వోలె కాలము పారుచుండె
ఇంటివారెల్లరకయితి కంటకంబు
విధవ జీవితక్షోభలు విశదమయ్యె
చిన్న మరదికి నాపైన చింతహెచ్చె

ఒక వసంతోత్సవానంద వకుళమందు
చిమ్మగొట్టాన నాపయి చిమ్మిరంగు
లాలసత్వంపు దృక్కుల నొలకబోయు
మనసు నెవ్వారో గొనిరను మమతనుండు
నంతలోన పట్టె ' మరది ' హస్తయుగళి

కౌగలించి అధరసుధ కాశపడిన
ఒడలు కంపింప విదలించి ఒత్తిగిల్ల
తొల్కరి మెరపు దేహిని పల్కరించి
తారుమారయి దిక్కులు తల్లడిల్లె

అత్తగారు చూచిన కోపమెత్తునయ్యొ
ఈడ నీకేమి పనులుండె యిట్టివేళ
అనుచు సజల నేత్రాలనే నడుగునంత
నీటిబిందువు లెన్నెన్నొ నేలరాల
చింతనొందవలదని తా చెప్పిపోయె

అజ్జ్యమగ్నుల సంయోగ మావడైన
ఇంపు సొంపుగ యెట్లైన యిమడవచ్చు
మరది హృదయంబు విషముగా మారిపోవ
క్రొత్తచింత నా శిరముపై కొలువుదీర్చ
కన్నవారింటి పయనంబు కలసివచ్చె

---

# పుట్టిల్లు-శీలభ్రష్టత

వివిధ వస్త్రవిభూషనై వెడలి నేడు
శ్వేతవస్త్రాన పుట్టింట చేరజూచి
ఇరుగు పొరుగులవారలు నీడువారు
గుండె లలయరోదించిరి దండుగట్టి

ధనము కాశించి ముసలికి దాపితీవు
జరుగవలసిన దేదియో జరిగిపోయె
మారుపెండ్లి నిపు డీవు మాన్యవర్య
చేయుమన 'రామ' యని తండ్రి చెవులుమూసె

కన్నయింటను కుండలే కడుగవలసె
భర్తతోడిదే సుఖమంత భార్యకనుచు
సాంఘికాచార తత్త్వంబు చాటుచుండ
వంటగాకున్న విధవతో పంటమేమి ?

రేచువోలె వదిన చెలరేగుచుండె
దుఃఖపూరిత యౌవన దుహితకొరకు
దేహసౌఖ్యంబును జనని త్రెంచలేదు
కర్మకై యేడ్వ కీగతి కలహమేల ?
తిన్నదరుగదే యని తండ్రి తిట్టిపోసె

చిలుక గోరువంకల బోలు చిరుతజంట
కంట బడినంత హృదిలోని కాంక్షలుబికి
ఔదునేమో నే నున్మాది ననెడి భీతి
కల్గి గడుపుచుంటి దినముల్ కఠినమతిని

తమ్ము కుర్రని పెండ్లియు తారసిల్లె
నూత్న వధువును గాంచనే నుత్సహింప
శుభసమయమున 'విశ్వస్థ చూపరాదు
ముఖమనుచు తల్లినన్ గాంచి మూల్గుకొనియె

వన్నె చిన్నె లలంకార వనితలెల్ల
ముద్దు ముచ్చట్లానందాల మున్గితేలి
మూల నున్న నాగోడు నమూలముగనె
మరచి పస్తుబెట్టిరి రేయి మాడె కడుపు

చిన్న మరదకస్మాత్తుగ పొన్నవాహ
నంబు బోలెడి రమ్యమౌ "అంబులెన్సు"
కారులో "వదినన్ గొన నరుగుదేరి
తి" నన, మీ వస్తువని తండ్రి తిరుగబల్కె

మంచి పయనంబు చిన్నారి మరదితోడ
గుండె లేలకో దడదడ కొట్టసాగె
కారు ఒయ్యారముగ చేరె కనకమేడ
ప్రాంగణపు లేగులాబుల ప్రాంతమందు

వీచ్చిన వసంతతరు సుమగుచ్ఛ పవన
తాకిడికి సోలి మతిదప్పి దరికిజేర
ముక్కుపై తర్జనిన్ బెట్టి నొక్కిచెప్ప
ఎరుగవే దేవరన్యాయ మెల్లవేళ

తెల్పు హక్కు నగమటంచు తెలియపల్కి
కౌగలించినన్ గొనిపోవ కౌతుకమున
ముద్దు గిల్గింత దొంతర ముద్దులెన్నొ
తొగరువాతెర సొగసుపై దొర్లిపోయె

డేగ పాల్పడిన కపోతిలాగ నాడు
మరది బాహుబంధంబులో మణగియుండ
పొంది మోదమౌ మోదమున్ పొందజేయ
గడచిపోయె రేయంతయు గడియలోన

తృప్తియౌన ట్లలంకార ప్రాప్తికల్గ
మధుర జోత్స్నను తాపముల్ మరుగుజేర
దేహమంత నుత్సాహ దీప్తిగల్గ
ప్రకృతి మర్మానుభూతుల ప్రథమరాత్రి

మగువ జీవితశోభకు మకుటమౌతు
జారిన తిరిగి జన్మలో చేరబోక
ఆడజన్మ కాధారమౌ అతుల చరిత
శీల సౌభాగ్యరత్నంబు శిథిలమయ్యె

# మిధ్యాపవాదు-బహిష్కరణ

కోరి చిన్నారి మరది నా గొంతుగోసె
ఇంట నడుగిడినంతనే మంటలెగసె
అత్త తోటికోడల బాధ హద్దుమీర
ఏలకో జన్మపై కల్గె నేవగింపు

జరుగు నిత్య నైవేద్యంబు నిరుగు పొరుగు
ఉబికి దృశ్యంబు గాంచంగ ఊడిపడిన
త్యాగమే చేసియుంటిని తన్నిపోవ
ఇచ్ఛపాడమె అయిన యెడ చొచ్చవలయు
విధవ కాశ్రయ మిచ్చెడి విజ్ఞులేరి ?

వెడలిపోవు ప్రయత్నంపు వేడ్కకంటె
వెడలగొట్టి యెట్లయినను విధవ కొనగు
ఆస్తి పూర్ణాహుతిన్ జేసి నాస్తి నాస్తి
యని శిరమున భస్మాసుర హస్తముంచు
యోచనే చేయునట్లుగా గోచరించె

మరదితో నీవు భాషణ మానవలయు
ననుచు కోపాన శాసించ అత్తగారు
సొమ్ము యెగబెట్టు కోర్కెకా సూక్ష్మబుద్ధి
యనగ తాకె బాణమువోలె నాత్మయందు

సిగ్గుపోనాడి మరదితో చెప్పుకొనగ
అమ్మ కనుమాన ముదయించె అగుకొంత
అయిన మునిగిపోయినదేమి ? అలసులేక
లేచిపోవుటకే నీవు వేచియుండు

విందు పెద్దదొకటి రేపు సుందరముగ
కారణము లేక జరుపంగ ఖాయమయ్యె
సుందరాంగుల నందడిన్ సున్నితముగ
పోదమని చెప్పి మరది తా ప్రోత్సహించె

అట్టహాసపు విందున అతివలెల్ల
నంద మానంద మోహనానంద ముద్దు
మురిపెముల దేలుచుండంగ మునలిఅత్త
నౌకరేల నీ గదినుండి నడచివచ్చె

అనగ పిడుగుపడినరీతి యలమటింప
సాటికోడలు ముత్తైదు సాక్ష్యమిచ్చె
వచ్చిన ప్రమదామణులెల్ల నొచ్చుకొనగ
అత్త నాపయి దోష మా యత్తపరచె

ఒప్పుకొన్నట్లు నౌకరు వంచె శిరము
స్త్రీ పురుష సమూహంబున సిగ్గులేక
దోషిగా నన్ను రూపించి రోషబుద్ధి
విరుగగొట్టిరి యాముకలు కరుణలేక

ఎత్తి దండములో పెట్టి నా యత్తతోడ
పిలు! మిథ్యాపవాదు నా తల్లి నాకు
చంపబోకుమటంచు నే సాగిపడిన
అర్ధరాత్రి బయట నెట్టి నిర్దయాత్మ
చల్లగా బిగియించిరి తలుపులెల్ల
మరది కైన కన్నులెంతయో మమతజెందె

ఎందరో స్త్రీ పురుషులున్న కొందరైన
ఇందణగియున్న గోప్యంబు పొందగోరి
ముందు వచ్చెడి సాహస మోపలేదు
బాపురే! హిందు విశ్వస్థ భావియేమొ!

ఏడపోవలె ? ఆశ్రయ మేడచిక్కు
కన్నయింట నే ముఖమున కాలుపెదుదు
బావినో గోతినో పడి ప్రాణమిడుదు
ననుచు దారిపట్టితి నే ననాథనగుచు

దైవ యోగంబుచే రాత్రి తల్లిభూమి
బంధుపొక్కడు తగిలినా బాధ చూచి
స్థితి గతుల గ్రహించి తా స్థిమితబుద్ధి
కరుణభావాన నన్నెంతో గారవించె

---

# సానివృత్తి

అనుచిత సాంఘికాచార సముదయంబు
బ్రహ్మరాక్షసివోలె బాధపెట్ట
సహనము మరపించి సాధుత్వమున్ జంపి
సాంఘిక బంధముల్ చప్పరింప
మస్తిష్కమన్యమై మాననంబేవేళ
ప్రతి హింసనే కోరి ప్రళయమెత్త
భయభక్తుల స్వీడి బాహాట రోషాన
విద్రోహచర్యలే విధిగతోచ

ఎందరెందరో మగువలీ చందముగనె
పురుషుల స్వార్థపరతకు కారణమయి
భిన్నరూపాన వేశ్యలై భీతిగొల్పు
సాని సంఖ్య పెరుగుటకు సాయపడిరో

పల్లెలో పొట్టగడవని బంధువితడు
ఇంత చక్కని గృహమున కెంత అద్దె
ఏడ తెచ్చి యేరీతిగా గడుపుచుండె
కాలమార్పును గుర్తించ కఠినమగును

గతము గతమే భవిష్యత్తు కానరాదు
వర్తమానం బొకటి అను వర్తనంబు
కన్న యిల్లత్తవారని కదపకుండ
రసమయంబగు జీవితరాసి యింక

ప్రక్క గదిలోని శృంగార ప్రౌఢవనిత
కిలకిలకిల నవ్వుచు నన్ను కలయజూచి
చింతకీ జీవితంబున చోటులేదు
ఆదరణ లేనిచోటను ఆశయేల ?
పురుషులు స్వార్థ చింతప్రపూర్ణు లెపుడు

ఇంట గోరాడుచున్నట్టి యింతులెల్ల
సానివృత్తినే జీవిత సాధనంబు
జేసికొన్నట్టివారని చెవికిసోక
హీన 'హిందు' సమాజంబు కానసయ్యె

పోవుచుంటినే బయటకు పువ్వుబోడి
క్రొత్త జీవితశోభను గుర్తెరింగి
తగు అలంకార దర్పముల్ తనియజేయు
మనుచు, వెడల ఆలోచన అధికమయ్యె
'తార్పువృత్తి' బట్టె నితడు నేర్పుతోడ
"కడుపు చేయించరానట్టి కార్యమేది"?

సుందర యువకు తోడ్తెచ్చి సున్నితముగ
గదిని జేరంగ నే ప్రక్కగదిని జేర
పారివస్తివే రమ్మని పట్టుపట్ట
ఏల గొనివచ్చినావని పల్కినాను

తెచ్చి విటుని చేతులబెట్టి తెప్పరిల్ల
అరితేరిన విటుడు నన్నాదరించి
తొలగె కష్టముల్ నేటితో తోయజాక్షి
అనుచు హారముగళసీమ నాన్చినాడు

ఒంటరిగ హారమున్ దీయ కంటనీరు
గ్రమ్మి హృదయంబు చలనమై కరగిపోవ
రాయినై నేను చైతన్య రహితనైన
వృద్ధ వేశ్య నవ్వుచు నాకు సుద్దుచెప్పె

పరువుగల్గిన వంశంపు పడతినవుచు
ఏల యోచనచేసెదో సాలభంజి
కృష్ణ గోదారి వరదకు కొట్టుకొచ్చి
నారె యెవరైన తెలిసిన నాకు చెప్పు

అందరము కులీనపుటింటి సుందరులమె
సాంఘిక దురితంబు లనెడి చావువలన
హీనరీతి గాసై పోతి ఒంచుమీమంతె
ఇహ సుఖముశంటె వేరేమి ఇందువదన

వృద్ధవేశ్య గరపినట్టి బుద్ధులన్ని
సత్యమని తోచి సంతోషసాగరాన
నుందు నంత విటుడు పంపె నుంచమనుచు
వేల విలువైన వస్తువుల్ వేడ్క నిచ్చె

మోద ఖేద సమయముల ముద్దుసుద్దు
గరపు వారెవ్వరును నాకు కానరారు
ఏల సంఘవేదిక మీద కళముపెట్ట
శిక్షయే గాని సంఘసుశిక్షలేదె ?
దేహసౌఖ్యంబు నేనేల త్రెంచవలయు ?

విటు డరుగుదెంచి విందుకు వెడలపల్కె
మేజువాణి, గానసభల మోజు హెచ్చ
పురుష లేరీతి చూతురో పువ్వుబోండ్ల
స్పష్టపడగ భరతభూమి సతులు కలరు
కోటి కొకడైన రాముడు కంటబడుట
సాధ్యమా యని తోచె నా స్వల్పమతికి

వేశ్యలందరు పోయిరి వేడ్క గాను
వీణ చేతికందించి నా వీపుచరచ
కంఠమెత్తి వీణాగాన కాంతు లొసగ
మంత్రముగ్ధుడై విటుడు నా మ్రోలచేరె

శ్రావణంపు నదిని బోలి శ్రద్ధతోడ
నిత్య జీవితశోభలు నిగుడుచుండ
సంధ్య శృంగార వాహ్యాళి సొగజేయ
వృత్తికెంతయో యనుకూల మెత్తివచ్చె

సంధ్య శృంగారములో నేను సొగజేయు
చుండ, మరది యకస్మాత్తు పండధరుని
భాతి చనుదేర చకితనై పల్కుకున్న
'వదిన' మాకండ్ల ముందిట్లు పాపకార్య
మెట్లు చూడగలమని తా సొట్టకొనియె

చేతులారంగ నాపిక చెలగితీవు
అనృత వాదంబుయెత్తి నీ అమ్మచంపి
యీడ్చిన మెదలలేక నా కిపుడు నీతి
గరుపవచ్చినావే నీవు కదలుమింక
అనగ చిన్నబుచ్చుకొనుచు అరగినాడు

కలిగె నృత్యగానంబుపై కాంక్ష యెంతో
ఓర్పు నెంతయో చేబట్టి నేర్చి నేను
విటుని రాగానురాగాల వేడ్క లేక
మనసు కొచ్చిన యట్లుగా మసలినాను

వత్సరమున నా స్థితియంత పట్నమందు
గాలివోలె నలముకొన గాన, నృత్య
సభల మితబుద్ధి నల్పి నే నరసజనుల
పిచ్చివారి జేసి ధనము పేర్చినాను
అయిన, మరది భయంబు నన్ననుసరించె

ధార్మికోద్ధారకులమని ధర్మబోధ
తనియ జేసెడి సాంఘిక ధర్మపరులు
నా విడియమును కాంక్షించి నాణ్యబుద్ధి
పడుపువృత్తి యాచార భావంబు వేరొ
హెూ ! యటంచును పల్కగా నోర్పుచచ్చె

పడుపువృత్తిని నేనట్లు వరలుచుండి
జ్ఞాన, యోగ, వాశిష్ఠాది గ్రంథపఠన
మెపుడు నే మానకుండంగ నిపుణబుద్ధి
జ్ఞానతత్త్వ విమర్శలే గాంచుచుంటి

---

# ద్రౌపది



వదిన నీవు లేకున్నచో బ్రతుకలేను
మేడయిత్తును ఆస్తి నా మేనునిత్తు
లెమ్ము లెమ్మని తా నెంతొ ద్రిమ్మరిలిస
తాపమే మది నెంతయో తాండవింప

కన్న, డాంధ్ర, మహారాష్ట్ర కధియవారు
తమిళ, మార్వారు, పంజాబు, తళుక్కుపార్సి
గోవ, యిస్లాము ముదితలు కులుకుచుండ
వేశ్య విటునిసంబంధమే వేడ్క యిపుడు
తెగిన బంధుత్వమున్ గూర్చి తీర్పులేల ?

త్రొక్కు నీ యాస్తి తుంగలో త్రొక్కు త్రొక్కు
కాలమే కరుణించిన కనకవర్ష
మే కురియు నా సదనమందు నీకు నీకు
ఒదిగియుండెడి గతియేల నోయి మరది ?

ప్రేమ యింత నాపై నీకు పెరిగియున్న
ఈడ మనముండు టేమంత యింపుగాదు
పోద మెటకైన మనమస పొంగిపోయి
కార్యసాధనకై వేగ కదలినాడు

విటున కంతయు తెల్పగా విడబోదు
వేలు నేబది యిత్తునే వేడ్కగాను
'చెక్కు' యిదిగో చేకొనుమని చేతికీయ
మార్చి తెమ్మని బంధువున్ కూర్చినాను
మార్చుకొని బంధువు తిరిగి మరలలేదు

పోయిన ధనము పోయిన పొట్టగడుపు
కొనుట కేమాత్రమైనను కొదువలేదు
పాపవృత్తి ప్రలోభాల పడిన నాకు
లాలసత్వంపు వేడ్కలు లావు కలిగె

విటుడు నన్నెంత ప్రేమతో పెంచుచున్న
లోభ కామాదివాంఛల లొంగియున్న
గణివృత్తిలో నొకనితో కలసియున్న
తృప్తియను వస్తువేరీతి ప్రాప్తియగును

సభల నృత్య గాన ప్రదర్శనమునందు
అంగ విన్యాస మొనరించి పొంగులలమ
హావ భావశృంగారంబు లలరజేయ
తీపినీటి కెదురుచను చేపవోలె

ఒకని మించిన విటు లొకరొకరు చిక్క
పీల్చి పిప్పిగా జేసి నే పేల్చుచుండ
గడచుచుండె నా జీవిక గడనహెచ్చ
చిక్కె నొక్క జమీందారు చెలువుమీర

మురుగులో మురిగి చనెడి పురుగువోలె
సానివాడల నెందరు నరసవరులు
దినము శలభ సంతతిభాతి దిక్కులేక
చచ్చుచుండిరో దైవమే సాక్షమయ్యె

పైరుపోయిన నే నింటి కరుగుదేరు
సంతలో యిల్లు నల్లరై సుంత మిగల
కుండ దోపిడిచేయగా కూలిపోయి
నీరు నీట గలిసెనని నేర్చుకొంటి

కబురుచేయంగ మరదికి కరుణలేక
అనుభవింపగవలె ' కర్మ ' మనగవచ్చె
క్రొత్తవిటుడు జమీందారు కోరికోరి
రేపు బెజవాడ పయానంబు లేమ యనెను

---

# శృంగ భంగము



క్రలిగె కర్నూలులో కొంత కార్యమిపుడు
అచట నుండి పోదమనుచు నాలపించు
కట్టి ' పయనంబు భూస్వామి పెట్టె ' బేడ
నెత్తి బెట్టి; కర్నూలు నాక్రొత్తచోటు

హొటలువానితో కొట్లాడి హొరుసల్పి
ఇల్లునే బాడుగకు గొని యింటజేరి
చిల్లి గవ్వయు చేతికి చిక్కనందు
వలన చిర్రుబుర్రుచేసి తా నలసిపోవ

అర్ధమే గాక నేనుండ అతను వచ్చి
నిన్ను నమ్మినందు వలన నేను చెడితి
ప్రక్కవారిని జూడ నా పరువుచచ్చె
అనుచు మధుపాన మత్తుతో నాగ్రహించి
చెప్పు చేగొని చెంపలు చెదరగొట్ట

నమ్మి నీతోడ వచ్చిన నారి నేను
అర్ధరాత్రి యీ విధముగ నాచరించ
చెల్లునే యన నౌకరుచేత నోరు
మూసి మేనివస్తువు లెల్ల తీసి నన్ను
యింట బంధించి వారెల్ల రేగినారు

ఇంట నుండి కోపంబుతొ గెంటె అత్త
బంధువును నమ్మి చెక్కెప్వ పారిపోయె
దాచుకొన్న గృహంబునే దోచగా స
శేష మీనాడు పూర్తి నిశ్శేషనైతి
స్వార్థమే గదా యిన్నింటి సార్థకంబు

తుంగభద్ర మునుగ గోరి తోయజాక్షు
లెందరో చనుచుండగా నెంతగానొ
అరచి యరచి నాగొంతు యలసిపోవ
తలుపు తీయంగ నొక్కరు దరికిరారు

చివర కెవరో ఒకానొక చింతనుండు
పిలుపు విని తలుపు తెరువ పిల్లవలెను
దుఃఖిత నగుచు నాగోడు తెలియపర్చ
మదిని చింతించి తా తెల్పె మరుగులేక

కలదొక విధవాసదన మి పల్లెయందు
యిష్టమగునేని నీవాడ రొష్టులేక
చదువు సంధ్యలు గరపుచు సంఘసేవ
సల్పవచ్చు ననంగనే సరియెయంటి

---

# విధవాశ్రమం

వృగున ప్రేమ మయప్రాణి మాన్యచరిత
కాని తీరనిబాధలు కలతబెట్ట
హృదయమంతయు నావిరై చెదరిపోవు
ఆదరించిన నాకిట్టి ఆరటేల ?

దివ్యసుందర నందనోద్దీప్తి యగుచు
కనుల కానంద మెంతయో కలుగజేసి
'రక్తి' హీనుల కనురాగ రక్తిగల్గ
వివిధ ఫలపుష్ప తరుగుల్మ వితతితోడ
చెలగు విధవాశ్రమంబును చేరినాను

చరితయంతయు చెవిబెట్టి కరుణబుద్ధి
ఒజ్జగా నియోగించి తా నోర్పుతోడ
కల్గి రూపు విద్యలు నిట్టి కర్మమేల ?
అనుచు నాశ్రమాధిపతి సన్నుడిగినాడు
ఆశ్రమమ్మును సౌందర్యమే ఆశ్రయించె

రాజు శృంగార రసమెప్పు రసములందు
రాజు సుందరోపాసన రమ్యజీవి
తోత్సవానంద సుశ్రీల తోత్సవంబు
జోగికైన భోగికయిన జోస్యమొకటి

ముప్పిరి గొనిన తొల్కారి ముదితలిట్లు
ఆశ్రమాన ననాథలై యుబ్బగనుండ
తెలిసికొంటి వారి చరిత్ర తేటపడగ
కష్టల నయిన నెరెంతొ కారె నాకు

కండ్లు విప్పకముందె పెండ్లి ముచ్చటపడి
అంతనే ముండయైన అతివయొకతె
కడు వృద్ధునకు గట్టి ముడియందొ విధవయై
ఆశలుపోయిన అబల యొకతె
ఉత్తమ స్థితియని ఉత్తి చెంతకు గట్ట
తట్టుకోలేనట్టి తరుణి యొకతె
పసికూనకున్ కోరి ప్రౌఢను గట్టగా
పారివచ్చిన యట్టి పడతి యొకతె

ఇట్టి సాంఘికదుస్థితి కట్టి కుడుప
దిక్కుచూపించి దరిజేర్చు దయలేక
సంఘ మానాటి కానాడు సమసిపోవ
కేవల విలాన మొక్కటే కీర్తియయ్యె

నిత్య విధి ధర్మచర్చలు గీత చదువు
కావ్య రామాయణాంబాది కావ్యపఠన
నియమబద్ధమై జీవితనీతి కెంతొ
బాహిరాశ్రమ నియమముల్ బాగుబాగు

గంట పదికొట్ట దీపముల్ కానరావు
గంట పదిరెండు వేళలో కత్తెదిప
మొక్క గదియుందు కాంపగా ముక్కుపయ్యె
కార్యదర్శి ఆ గదనుండి కదలిపోయె

ఇంతలో ప్రక్కగది యందు సెంటి పురుషు
లొలకబోసెడి ఆనంద కలరవములు
కర్ణముల సోకినంతనె కాంతి దప్పి
సిగ్గుతో మనసెంతయో చిన్నపోయె

భద్రమానవు డంతలో బాటపట్టి
బయట తలుపు యదావిధి భద్రమయ్యె
ఆశ్రమాభివృద్ధి కితడె ఆటపట్టి
టంచు తెలియవచ్చె చెవికి అలసె జీవి

రాత్రి సంగతి నేనొక్క రమణి నడుగ
క్రొత్త నీకింక యీాడ నో కోమలాంగి
రెండు దినము లోపకపట్టి యుండుమింక
ఆజ్ఞపాలించినట్లైన అగగలవు
అంత గాకున్న వారు గెంటింతురపుడె
అనుచు నాశ్రమ గోప్యంబు లతివబల్కె

అట్లయిన యిది ఆశ్రమంబగుట యెట్లు ?
స్వార్థ పురుష విలాసాల సదనమనగ
తప్పుగా దెంతయో యిది ఒప్పిదంబు
మాయమరౌ మార్గమునకయి మసలుచుండు

త్రాగుబోతుకు ధనముకై తార్చగోరి
'నేత' జేసిన యత్నంబు నేలగూల
కఠినవక్షస నాపైన కలుగజేయ
ప్రక్కయింటి యువకునితో పారిపోయి

భార్య భర్తల రీతిగా బ్రతుకనెంచి
బ్రతుకు జీవుడా యని నేను బయటబరి
నాటి కెట్లో మణగియుండి నాణ్యబుద్ధి
చేరితమి మలిరోజునే చెన్నపురికి

పోవు రెండవ తరగతి భోగియందు
తారసిల్లెను మాకొక తరుణ జంట
వీక్షణమునవే స్త్రీలెంతొ లక్షణముగ
నేస్తురాండ్రగు సహజంపు నేర్పుగలదు

చేరినాము మే మొకప్రక్క తీర్చిదిద్ది
సల్పినా మెన్నెన్ని గోష్ఠులు సరసబుద్ధి
వరుసలో తానొక విధవ వనితననుచు
తండ్రి మారువివాహంబు తనియజేయ
పారుచుండెను హాయిగా బ్రతుకుదెరువు
కానిచో యెన్నిబాధలు గాంచవలెనొ ?

చెలియ మాటకు నా కన్ను చెమ్మగిల్లి
తండ్రి నాడె వివాహంబు తలచియున్న
పరువు హీనపు నేటి యీ బ్రతుకుకంటె
పెనిమిటి కరకమలమున పెరిగియుండు

సాము గరిడీల తేలిన సాని నేను
గుట్టు నేనెట్లు యిప్పోవ్పల్క రట్టుజేతు
సత్యవాది కీ జగతిలో స్థానమేది ?
భార్యభర్తలమే మని పల్కినాను

" సెంట్రలు స్టేషను "న దిగి చెప్పి యింటి
గుర్తు తప్పక రమ్మని కోరికోరి
వదలలేక వదలలేక వారు చనిన
కారులో మేము వసతికి చేరినాము

నీటికంటెను డబ్బును దాటి బుద్ధి
వాడుచుండంగ కనిపెట్టి వసరుగల్గి
సూక్ష్మ సూచనచేసితి కాంక్షతోడ
" వస్తువుల కయి వనజాక్షి పస్తుకొప్పు "

పచ్చ కాగితములే చాల చచ్చిపోయె
' పయిన ' లేకున్న పట్నాన పలుకదంబ
వీడిపోవునా యేమొకో ? వీడు కూడ
అనుకొనెడి సంతలో వాని అన్నవచ్చి

తిట్టరాని తిట్లన్నెన్ని తిట్టపోయు
క్రొవ్వి పెరాటలు యజమాని నవ్వుకొనుచు
“ పంకుగాడవలే యీనాటి రక్తికట్టు ”
తమ్ముని గాని పెమ్మింకను తఱయనేల ?

అవు వెనుక వెనుక లెగ యురగినట్లు
అన్న వెనువెంటనే తమ్ము పరగినాడు
“ టాక్సి ” మాట్లాడు కూర్చుండ టాపుతీయు
పేరుతో యెవ్వరో నన్ను పిల్చి భాగ్య
నగర జీవితగాథల నచ్చుబల్కు
చూడవచ్చితి నేనన కూడగాసియె

ఇతడు లక్ష్మీసుతుడు పసుట యింతలేదు
సంశయం బొక నిముషాన నల్పు నెన్ను
నరన జీవితశోభకు సాగివచ్చు
దేహగేహాల నజ్జులు తెగువగల్గి

ఎంత సానులమైనను నింతులమెగ !
చెన్నపురి నగ్నదృశ్యాల గన్న నాకు
భాగ్యనగరపు బ్రతుకులు బాడుగట్టె
భాగ్యరేఖలో యేమేమి పొడుకానెనా ?

---

# వేశ్య వృత్తి పోషివృత్తి

శ్లేష జీవితమంతయు శోషలేక
గృహిణినై యుండకోరి నే గహనచింత
తరుణ యువకుని చేబట్టి తరలిరాగ
వీడకున్నది బంధమై వేశ్యవృత్తి

నరసు తృప్తికై త్రాగుడు సాకినాను
మోహ పరవశమున నున్న మోహనుండు
ఇంటికే పోక, పోయిన, యింతినెపుడు
చావకొట్టి చెవులు మూయు నరనమయ్యో
లేమ పడలేక ఒకనితో లేచిపోయె
ముఖము చెల్లక మనుజుండు మురిగిపోయె

" తద్ధిమిత, ధిమిత " యనుచు తళుక్కు బెళుక్కు
భరత నాట్యభంగిమలతో పల్కరింప
సహజమైనట్టి కన్గిటు శరమువోలె
సర్వనాశనముగ జేసె నరనవరుల

గ్లాసుకో షర్టుజేబులో కలిగియున్న
క్రొత్తనోట్ల మడతలలో కోరికోరి
ఉత్తమ పురుషులే చీట్లు తిప్పతిల్ల
దక్షిణల నిచ్చుచుండిరి లక్షణముగ

రూపు సంగీత సాహిత్య దాపుగల్గి
నయ, వినయ, అనునయ నయనములగీటు
సింగమాకట లేళ్లపై ఛంగు ఛంగు
గెంతినట్లు విటులపయి గీటినంత
పీస్గు పెంటలై రెందరో పేరులేక

స్వాగతంబు నవ్వులకు సుస్వాగతంబు
వాచకము పాతకు స్వస్తివాచకంబు
దక్షిణలు తార్పు కక్షయ దక్షిణతతి
వారవనితకు సహజంపు వన్నెతెచ్చు

రేగి చెలరేగి రేచునై రేయిఃబవలు
సభల సన్మాన గోష్ఠులు సల్పుచుండ
వైష్ణవాష్టమి నాడొక విష్ణుగుడికి
ప్రీతిపూర్వకమైనట్టి పిలుపు వచ్చె

బండి దిగి చను నన్గాంచి భక్తకోటి
భక్తి ప్రక్కకు నెట్టుచు ప్రతిమలైరి
దైవసన్నిధి విదియేమి దాపురంబొ ?
పెద్ద వైష్ణవు డెంతయో పేర్మిజూపె

అడనున్న విలాసాల హానములను
చూడ నామది యేలకో చోద్యమంది
సూత్రభాష్య మాదిగ గ్రంథ సూత్రతతిని
చదివినట్టి నేనెంతయో చకితనగుచు
గానమైనంత శడంపుక గడపకొస్తి

పెద్ద వైష్ణవు డాచార్య పీఠమూర్తి
చూపు విద్యల దాహాన దాపుజేరి
హార సత్కారమున్జేసి గారవించ
బ్రాంది కప్పు నందించి నే ప్రక్కనుండ
చిత్తుగా త్రాగి శివమెక్కి మత్తులోన
మెక్కె "కుక్కుట బిరియాని" మేను వణకె

కర్మచింతలు పగలెల్ల ధర్మబోధ
పాదపూజలు గొనుచును పట్టి పట్టి
కాళరాత్రిలో వేశ్యల కాళ్లనొత్తి
బ్రాంది విస్కీల సేవించి బ్రతుకునట్టి
నీచులే నేటి సంఘాన నీతిపరులు

అద్దెకు దిగె సజ్జను డొక డతివతోడ
గర్భవతి హీన ఆరోగ్య కలత హృదయ
ఆమె వదలి వాడాడాడ అరుగుచుండ
శీతలోపచారములతో చింతబాపి
ఆదరాభిమానాల నే నాదుకొంటి

చెప్పసాగెను తన గోడు చెలియమిన్న
మగడు చచ్చినతోడనే మరల నాకు
పెండ్లి యత్నముల్ చేయంగ అడ్డువచ్చి
కూడదిది శాస్త్రమెప్పుడు కూడిరాదు
వద్దనిన, మూర్ఖభక్తితో వదలుకొనియు

చదువు లి నజ్ఞునకదనె సాగజేయు
మంత్రముగ్ధగా జేస సస్ స్త్రీలసప్ప
ప్రకృతి లక్షణంబులు పెయి పొడకొనగ
భయముతో మంపులెన్నియో పట్టజేయు
దేహలక్షణమంతయు త్రెళ్ళిపోవ
లేచి యిల్లొచ్చినామని లేను చెప్ప

డాక్టరమ్మను పిలిపించి దయితకపుడు
మందు లిప్పించ రోగంబు మ్కపోయె
స్రావమయ్యెను గర్భంబు వావుపప్పు
బ్రతికి బయటపడి తుదకు బట్టకట్టె

దినదిన ప్రవర్ధమానయై తెబరిల్లి
పండితుం డొల్లనని యెటొ పారిపోయె
నరసు లామెపై దృష్టులు సాగజేయ
వృత్తిసాగించమన నామె ఉత్తరించె

నీతి యొప్పారుచుండె యా నాతియందు
అయిన సానిగృహంబున ఆగియుండ
తాడిక్రిందగ పాలను త్రాగినట్లు
ధిక్కరించి పెండ్లాడెడి దిక్కులేదు

నా చమత్కారమాటలు నీచమయ్యె
ఆశకల్పింపగా అడియాశలయ్యె
చెడుదునని భీతి తా చింతచేసి యేమొ ?
పయిటకొంగు సహాయాన ప్రాణమొదల
పదిల హృదయంబు నాదెంతొ బ్రద్దలయ్యె

వీథివంక నే జూడంగ వింతగొల్పి
తెలియపంపగా నొకరు తెలియజెప్పె
శిష్యురాలిని ముట్టన చితుకగొట్టి
పండితుని ఖైదుచేయంగ పంపుచుండె

రూపు, విద్యావివేకంబు రూఢయైన
శీలవంతుడు కానిచో చిక్కు మెండు
చరితహీనుడు కనుక నే చదివినట్టి
పండితుడయిన యీగతి పట్టె నిపుడు

ఇంతను మనసు నాపైన పంతగించి
ఇందులో కల్గు భాగంబు యింతులకును
సచ్చరిత్రను సుఖ శాంతి సాగుచుండు
కామవాసనలో తృప్తిగాంచరనుచు
స్పష్టపరచె నా కెంతొ విస్పష్టమయ్యె

ట్రిప్లికేన్ బీచి నొకనాడు తిరుగుచుండ
రైలుసంగాతకత్తియ రమ్యబుద్ధి
కడుపుపంటతో హాయిగ కనులముందు
ప్రీతిగొల్పెడి మాటలు ప్రేమగొల్పె

---

# వైరాగ్యం

పండిత, కవి, విమర్శక, పామరుండు
స్వామి, సన్యాసి, ఆళ్వారు, సరసవిరస
యువక, ప్రౌఢ, కౌమారవృద్ధవికలుండు
దొంగ, దొర, పాపి, జూదరి, త్రాగుబోతు
హిందు, ముస్లిము, క్రైస్తవ హద్దులనెడి
వాద భేదంబులేకయే వనరుకల్గి
సంచరించి తత్త్వంబునే సంగ్రహించి
కల్ల యనురాగరాశితో గడపినాను

ప్రేమతత్త్వంబు మనములో పెరిగియున్న
పరిసర పరిస్థితుల ప్రభావంబుచేత
ఉత్తమోత్తమ వంశంపు టువిదనైన
ప్రాణమున గల తీపిచే పతితనైతి

అపురిన్ సానివాడల నరయుగోరి
పిచ్చిదాననై పురమంత నచ్చినట్లు
స్వేచ్ఛగా తిరిగి తిరిగి సేదబుద్ధి
ఇల్లుచేరితి దిగులుతో కల్లగాదు

దివ్యసుందర హర్మ్యాల తేలుచున్న
భీతిగొల్పెడి రోగాలు గాతబెట్ట
తిరిగి విటులాగమమునకై తేరిజూచు
కృత్రిమ శోభానికగణిక గృహములెల్ల

ముక్కు పగిలెడి దుర్గంధ మురికిగుంట
యింట పక్కపరుపు లేక యింతులంత
తాటి, యీతాకు చాపల తనియజేసి
వదనమున పౌడరెంతయో వత్తివత్తి

బీడి సిగరెట్ల ప్రేమతో పీల్చుచుండి
ఒకటి రెండణాలకో లేక ఒక్కకాని
" చిలకకొట్టు చారుమినారు సిగరెట్టుకయి
ఒడలునిచ్చియు తగువాడు ఉవిదయిండ్ల

స్వార్జితంబైన సుఖరోగ సముదయంబు
పండువంటి శరీరంబు నిండజేసి
వేడిమంట లుప్పొంగంగ వేగలేక
లోన కుమిలి కుమిలి యేడ్చు లోలజాతి
గాంచగా మదికెంతయో కరుణగల్గి

బుద్ధియంతయు యోచనా బద్ధమయ్యె
పాప జీవితమంతయు పాతిపెట్టి
దాన ధర్మాలకై సొమ్ము ధారపోసి
పారలౌకిక గోష్ఠిలో పడితి నేను

తులసిపూజలు రుద్రాక్షమాలచేత
ధర్మమీమాంస గ్రంథాలు కర్మగోష్ఠి
భజనలు చితారుపాటలు భక్తిబోధ
నవ్యజీవితసాధనై భవ్యమయ్యె

ఆశ్రమంబది సన్న్యాసి ఆశ్రమంబు
వస్త్రమయ్యది కాషాయవస్త్రమయ్యె
గుండు అయ్యది మున్నని బోడిగుండు
భోజనంబట సాత్త్వికభోజనంబు
భోగమాడ దేవేంద్ర వైభోగమాడ

చూడ చూడ నామది శాంతి శూన్యమయ్యె
పరిచయ గణికలందరు పరిహసించె
' వృద్ధవేశ్య పతివ్రత ' సుద్దుచెవికి
సోక జీవవాయువు లన్ని సోలిపోయె

తీర్థయాత్రల సేవింప కోర్కెపొడమి
చీర, పక్కచుట్టయును చేత చెంబుతోడ
ఎక్కి మూడవతరగతి నేగుచుండ
కునుకుపట్టిన యంతలో కూర్మితోడ

శీలరక్షణకై స్థిత సిద్ధినొంది
పడతిలోకాని కాదర్శపాత్రయైన
సుగుణ షోడశవర్షాల సుందరాంగి
కనులముందు ప్రత్యక్షమై కదిపె మనసు

మేల్కొని కలయజూచిన మేను వ్రాల్చి
పెట్టెలో నున్న జనుతెల్లి పెట్టనివ్వ
మత్తులో నుండ సృష్టిని మర్మమెరిగి
బంటు దిగి నేను బాటను పట్టినడువ
తల్లి గోదారి నాముందు తాండవించె

తాండవించెడి గోదారి తల్లి నిండు
గర్భమున యీ తనువు చేర్చ కాంక్షగలిగి
వినతిచేసితి నేనొక్క విన్నపంబు
ఇంతలో వచ్చినావీవు గొంతుపైకి

ఓ మహాశయా! నా గాధ ఓర్పుతోడ
విన్న నీకు కృతజ్ఞతా వినతులయ్యా
వ్యక్తమయ్యో నీ భావమవ్యక్తరీతి
బాటలో గడ్డి యొరితి పట్టునయ్యా ?

---

